# పీఠిక

చండకౌశిక మనునీనాటకము క్షేమేశ్వరుఁ డనుకవీశ్వరుఁడు గీర్వాణభాషయం
దు రచియించినాఁడు. చండకౌశికశబ్దమునకు మిక్కిలి కోపముగలవిశ్వామిత్రుఁ డని
యర్థము హరిశ్చంద్రునికారణమునఁ గౌశికుఁడు ప్రచండతను వహించినకథ నిందుఁ గ
వి వర్ణించుటం జేసి దీని కానామధేయము ఘటిల్లినది. హరిశ్చంద్రునిచరిత్రము స్కాం
దపురాణమునం దొకవిధము గాను మార్కండేయపురాణమునందు మఱియొకవిధము
గాను గాన వచ్చుచున్నది. రసవంతముగా స్వేచ్ఛమై నాంధ్రీకరించి ప్రకటించిన శం
కరకవిప్రబంధము దేశమం దెల్లెడ వ్యాపించుటం బట్టియో మఱి యేహేతువుచేతనో
గాని స్కాందపురాణోక్తమైనకథయే యాబాలగోపాలప్రసిద్ధ మయినది. తఱచుగా
నాధునికులు ప్రదర్శించెడు నాటకములయందు నదియే మనము చూచుచున్నాము.

సత్యము తప్పనివాఁడు లోకములో నెవ్వఁడేని కలఁడా యని దేవేంద్రుఁడు త
ననిండుగొలువున నడిగినప్రశ్నమునకు నుత్తరముగా హరిశ్చంద్రుఁడనురాజపుంగవుం
డొకఁడు గలఁ డని వసిష్ఠుఁ డన్నమాటమీఁద బిట్టుగినిసి కౌశికుఁ డెట్టు లయిన నే నా
తని బొంకింతు నని ప్రతిజ్ఞ పట్టి యాపట్టును నెగ్గించుకొనుటకు నక్రమముగా నెన్నె
న్నో మాయలు పన్ని యామన్నీని నెన్నరానియాపదలపాలు పఱిచి నట్లు స్కాందంబునఁ
జెప్పఁబడియున్నది. తపోధనమూర్ధన్యుఁ డయినవిశ్వామిత్రమహర్షి ని నంతయవివేకపుఁ
బాత్రముగాఁ బ్రదర్శించుట నాటకస్వభావమునకు సరిపడి యుండ దని కాఁబోలు క్షే
మేశ్వరకవి యాపుంతను విడిచి యక్కడక్కడ నొక్కింతమార్పుతో మార్కండేయపు
రాణోక్తకథాసరణి నీనాటకమును నడిపించి నాఁడు.

హరిహరహిరణ్యగర్భుల విద్యాత్రయమును దాను సాధింతు నని గాధేయుఁ డు
గ్రతపంబుఁ జేయుచుండగాఁ నవ్విద్యలాముఖ్వర కే కాని మఱి యెవ్వరికిని నుండఁ బోల
దని విఘ్నరాట్టు, వరాహరూపమున నొక యరణ్యమునఁ బ్రవేశించి, తనచేయు రాయిడి
కోర్వలేక మొఱ్ఱవెట్టుకొన్న యెఱుకుల మున్నుంచుకొని వేఁట వచ్చినహరిశ్చంద్రుని, నా
యోపాయమున విశ్వామిత్రాశ్రమమునకుఁ గొనిపోయెను. అప్పు డమ్మునితపఃప్రభావము
న హోమకుండములోనికి వచ్చినవిద్యలు "కటకటా! యనపరాధినుల మనాథల మ
శరణ్యల మగ్నికుండమునఁ ద్రోయఁబడుచున్నాము, మందభాగినులను మమ్మురక్షింపుఁ
డు రక్షింపుఁ" డని యంగలార్వగా నయ్యార్తాలాపంబులు తనచెవిని బడినందున నెవ్వఁ
డో క్రూరరాక్షసుఁడు స్త్రీహత్య చేయుచున్నాఁడని యాగ్రహించి యిదిగో మీ కభ
యప్రదాతను వచ్చుచున్నాను. వెఱవకు వెఱవకుఁ డని యారాజు, తోడనే యక్కడ
కుఁ బోయి యాబీభత్సకర్మంబునకు రోసి, యెఱుంగమిం జేసి యూరుసిని మిగుల గ

ద్దించి పలికెను. అంతమీఁదఁ దోఁక ద్రొక్కినపామువలె నామునీంద్రుఁడు మండిపడఁ
గా నవ్విద్యలతనికిఁ దపోవిఘ్నమయిన దనుసంతసముతో మాకుఁ బ్రియము మాకుఁ బ్రి
యము; హరిశ్చంద్రమహారాజా! నీకు జయము నీకు జయ మనుచు నంతర్ధానంబు నొం
దిరి. తనచిరతపఃప్రభావంబునఁ జేతిలోనికి వచ్చినమహాఫలమును నిమిషములో నిల్లెగరఁ
గొట్టి వేసినవాఁడు హరిశ్చంద్రుఁ డని తెలిసినతోడనే విశ్వామిత్రుని కాతనిమీఁద నాఁ
పరాని కోపము వచ్చి పగతీర్చుకొనుటకుఁ బ్రయత్నించెను. స్కాందమునఁ జెప్ప బడిన
దానికంటె విశ్వామిత్రకోపమున కిది సయుక్తిక మైనకారణముగానుండు నని నేనూహిం
చుచున్నాను. ఇట్లే మఱి కొన్నివిషయములు గూడ దీనియందు సరస మయినమార్పులను
బొంది వన్నె మీఱుచున్నవి. నాటకము చదువుటవలన నాయాయంశములు గోచరింపఁ
గలవు గావున గ్రంథవిస్తరభీతి నవి యిచ్చట వివరింప నయితిని.

క్రోధకరుణ బీభత్సరసంబుల కాలవాల మయినయీనాటకమునందు శృంగారరసము
న కవకాశము లేక పోయినను బ్రథమాంకమున దానికిఁ గూడఁ గవి కొంచె మవకాశ
ము గలిగించినాఁడు. హరిశ్చంద్రునికి రాఁగలయరిష్టములు దివ్యదృష్టిని దెలిసికొని వసి
ష్ఠుఁడు తచ్ఛాంతికయి యారాజునకు నొకనాఁడు రహస్యముగా రేయెల్ల జాగారము
చేయ వలయు నని యాదేశించెను. ఆకారణమున నాఁడా యంతఃపురమునకుఁ బోక
మఱునాఁ డుదయమున దేవిని జూడ నేగుచుఁ గడచినరేయి తనకొఱకు వేచి యుండి
ప్రియురాలు మిక్కిలి వలకాఁకను వేఁగి యుండు నని తలంచుకొని తద్విషయమును
రాజు విదూషకునితోఁ గొంతప్రస్తావించినాఁడు. అక్కడఁ దక్క మఱి యెక్కడ నిం
దు శృంగారరసము గోచరింపదు.

హరిశ్చంద్రునిభార్యకుఁ జంద్రమతి యనియుఁ గుమారునికి లోహితాస్యుఁ డని
యుఁ బ్రసిద్ధనామములు గలిగి యున్నను మార్కండేయపురాణకథానుసారముగా వారి
పేరు లిందు వరుసగా శైబ్య యనియు రోహితాశ్వుఁ డనియు వ్రాయఁబడినవి. సామా
న్యముగా విన వచ్చు హరిశ్చంద్రకథకును దీనికిని మఱి కొన్ని భేదములు గూడఁ గా
నఁబడ వచ్చును. అట్టివానికిఁ గారణము పూర్వోక్తపురాణమునందలి ప్రథమాశ్వాసము
న ద్రౌపదేయకథాప్రకారకథనంబునకయి పక్షివరులు వివరించిన హరిశ్చంద్రోపాఖ్యా
నముఁ జదివిన స్పష్టపడియెడును. కవిబ్రహ్మయనఁబడుతిక్కనసోమయాజికిఁ బుత్ర నిర్వి
శేషుఁ డగుశిష్యుఁడు మారనకవి యమృతప్రవాహానుకారిగాఁ దెలిఁగించిన యప్పురాణ
ము బుధబుభుక్షాపనోదనదక్షం బయినను జిరకాలమునుండి యేమూలనో కీటకంబుల క
శనం బగుచుఁ దాళపత్రసంపుటంబుల డాఁగి యుండి, విద్వత్ప్రభువులు పోలవరనామక
మున్నెసంస్థానాధిపతులు నగు మ॥ రా॥ రా॥ శ్రీరాజా కొచ్చర్లకోట రామచంద్రవేంక

టకృష్ణారావు బహద్దరు బీ. ఏ. గారి కారణమునఁ జదువరుల పున్నెము పండి యిప్పుడు విశుద్ధాకృతిని బయటఁ బడినది. ఆవారు ప్రకటించెడు సరస్వతీపత్రికయం దాగ్రంథము ననేకులు చదివియే యుందురు.

క్షేమేశ్వరకవిచరిత్రమును గుఱించి కాని తద్విరచితము లగు నితరగ్రంథములను గుఱించి కాని తెలుపుట కిప్పటి కేమియు నాకుఁ దెలియవచ్చినది కాదు. ఈనాటకమును దెలిఁగించుటయందు నేను విశేషశ్రద్ధనే పుచ్చుకొన్నాను. అయినను నాకించిజ్జ్ఞతనుబట్టి యిం దనేకలోపము లుండ వచ్చును. భాషాప్రపంచమున నభిమానము గలమనీషావంతులు సముచితరీతి వానిం బరిహరించి దీనిం దమయాదరమునకుఁ బాత్రము గావింపఁ బ్రార్థించుచున్నాను.

రాజమహేంద్రవరము.
22 జూలై 1900 సం॥రం

వడ్డాది సుబ్బారాయఁడు.

## శుద్ధపత్రిక.

| పుట. | పద్యము. | పాదము | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| ౧ | ౩ | ౧ | నమా | సుమా |
| ౨ | ౨౨ | ౪ | దశ | దర్ |
| ౩౫ | ౬ | ౧ | చెట్టువ | చెట్టుప |
| ౩౬ | ౧౬ | ౨ | లార్పు | లార్చు |
| ౪౫ | ౭ | ౪ | నాలిఁ | సాలిఁ |
| ౪౬ | ౬ | ౧ | బోయి | బోలు |

# ఈనాటకమునందలి పాత్రములు.

## పురుషులు.

హరిశ్చంద్రుఁడు — అయోధ్యాధిపుఁడు. కథానాయకుఁడు.

బోధాయనుఁడు — రాజునకు వేడుకచెలికాఁడు.

తాపసుఁడు — వసిష్ఠశిష్యుఁడు. రాజునకుశాంత్యుదకముదెచ్చినవాఁడు.

వనచరుఁడు — రాజును వేఁటకుఁ బిలువ వచ్చినకిరాతుఁడు.

విఘ్నరాట్టు — విశ్వామిత్రుతపముఁ జెఱుప వరాహమయినవాఁడు.

సూతుఁడు — రాజుసారథి.

విశ్వామిత్రుఁడు — రాజువలన రాజ్యదానము పొందినమహర్షి.

పాపపురుషుఁడు — పురుషరూపము ధరించినపాపము.

భృంగీశ్వరుఁడు — శివుని పరిచారకుఁడు.

రోహితాశ్వుఁడు — రాజు కుమారుఁడు

ఉపాధ్యాయుఁడు — రాజుభార్యను కుమారునిఁ గొన్నబ్రాహ్మణుఁడు.

వటుఁడు — ఉపాధ్యాయుని శిష్యుఁడు.

విశ్వేదేవులు — విమానమునుండి విశ్వామిత్రుని నిందించినదేవతలు.

ధర్ముఁడు — రాజును గొనుటకుఁ జండాలవేషియయినధర్మదేవత.

అనుచరుఁడు — ధర్ముని శిష్యుఁడు.

కాపాలికుఁడు — రాజుయోగ్యతఁ బరీక్షింప మఱియొకవేషము దాల్చినధర్మదేవత.

బేతాళుఁడు — కాపాలికు నాజ్ఞచే రాజునొద్దకు నిధిదెచ్చినపిశాచరాజు.

పురుషుఁడు — ధర్మునిపరిచారకుఁడు.

## స్త్రీలు.

శైబ్య — రాజుభార్య.

చారుమతిక — చేటి.

హేమప్రభ — ప్రతీహారి.

విద్యలు — విశ్వామిత్రుని హోమకుండమునఁ బ్రత్యక్షమయిన త్రిశక్తులు.

యెలుకలాగున నిటు నటుఁ బరిభ్రమించుచున్నావు.

రాజు — మిత్రుఁడా! ప్రాణులకు శరీరధారణవిషయంబునం బ్రథమకారణము నిద్రయే గదా!

ఉ. చిత్తముఁ దేలుచుం, జులుకఁజేయు సమస్తము లైనయంగముల్,
శ్రోత్రము కాసకుం బ్రతిభకుం గలిగించుఁ, దొలంచు దోషముల్
బొత్తిగ, ధాతుసామ్యమును బొందఁగఁజేయును, వేయు నేటికి
త్యుత్తమయోగసవ్యసుఖ మొక్కటఁ గూర్చుచు, నిద్ర యల్పమే? ౮.

అందుచేతనే చూడు నాకిప్పుడు—

ఉ. నిద్దురబద్దకంబునను నెమ్మొయికిన్ విలు పావహిల్లెడున్
దద్దయు, ఖేదభారముకతంబునఁ బ్రస్మితంబు చిత్తమున్,
పెద్దగ నావులింతలు జనించెడు మోమున సారెసారెకుం,
బ్రొద్దుటి కేఁత యొండపోలుపుం గన సైఁపదు చూపు లేశమున్. ౯.

(ఆలోచించి విస్మయముతో) ఇప్పుడీ నిశాప్రజాగరవ్రత మాదేశించుటకుఁ బూజ్యలగు కులపతులయభిప్రాయ మేమయి యుండునో? ఏమయిన నేమి? గురుశాసనములు విమర్శనార్హంబులు గావు.

విదూ— చెలికాఁడా? నే నాలోచించిచూడఁగా వాసకసజ్జిక యగుదేవి ఖండిత యయ్యెడు ననునర్థము దక్క వే ఱొక్కటి యీ వ్రతమునకుఁ బ్రయోజనము గానరాకున్నది.

రాజు— మిత్రుఁడా! నీ పరియాచకములు మానుము.

విదూ— అయ్యా! నీకిది పరియాచకము గాని యనాథవటునకు నాకు మహానర్థము.

రాజు—(సోత్కంఠముగా భయమును నటించుచు) మిత్రుఁడా! దేవి యేమి చేయు నని నీ వనుకొనుచున్నావు?

విదూ— చెలికాఁడా! నిశ్చయముగా నామె కోపము చేయు నని యూహించుచున్నాను.

రాజు— మిత్రుఁడా! అది తప్పదు. అందుకు సందేహ మేమి? దేవి కిది సామాన్య కోపకారణము గాదు. చూడు.

ఉ. మంతురు లాఁగిరో, హితసమాజము గోష్ఠికిఁ జొక్కి నిల్చెనో,
కాంతుఁడు, వే ఱొకర్తు ననుఁ గా దని కూడెను, రాఁడు ధూర్తుఁడై

యింతకు నంచుc, గిన్క వెలి వెక్కినకన్నుల జాలువారి మో
మంతయుc దోcగ నూర్చి, ప్రియురాలిc కనే మనుజాధునల్ శరుల్? ౧౦

మఱియు

చ. చెలియ యొయ్యార మొప్పcగయి సేయుతమిన్ మునిమాపు వచ్చి, యా
వలి దగుజాము నాతెరువుపైc గను లుంచుక వెళ్లcబుచ్చి, యొ
వ్వల నిక రాcడు ధూర్తుcడని, బాష్పము లూర వగల్ సడల్చి సొ
మ్ములc, గొఱఁతేయి యెట్లొ గడపుం బెడపాన్పనc బొర్లుచున్ సఖా. ౧౧

(చింతించి) మిత్రుcడా! నిశ్చయముగా నీలాగు జరుగును. ఎట్లనcగా—

చ. ఉవిద మదాగమాశ యయి యుండcగ రా నెవరేనిc, దా వృథా
యవిరళసంభ్రమోద్గమన యైనc, జెలంగు మఱుంగుగా, సఖుల్
సవసవcగాంచి యొండొరులc, జప్పుడొనర్పక లోన నవ్వుకో,
నవుదల యెత్త నోటు బిడియంపడి యాబిడ వారిముంగడన్. ౧౨

విదూ— చెలికాcడా! కడచినదానికి వగచుచు నేల యాయాస పడియెదవు?
లెమ్ము. మన మక్కడకే పోయి దేవిని బ్రసన్నురాలిని జేసికొందము.

రాజు— (సశ్లాఘముగా) ఓయీ! నీవు బాగుగాc బలికితివి. రమ్ము. మన మక్క
డకే పోవుదము. (నడచుచున్నారు)

రాజు— (ఖేదముతో నిట్టూర్పు విడిచి) మిత్రుcడా! తటి దప్పటను బట్టి యిప్పుడ
పోవుట నాకు ఖేదకారణము.

చ. ఎడపడునాకథం దిరిగి యెత్తుచు, నే నరుదెంచుదారిc గ
న్నిడుకొని, గడ్డిపోcచ చలియించిన నన్నుcగ నెంచుకల్కి, వె
న్కడ నిభృతంబుగా నరిగి కానక యుండcగ వుంగిలింపc, గ్రే
ఖుడి విరినల్లగల్వ...ను బోలెడుకన్నులు మూయc జేతులన్. ౧౩

విదూ— (నడచి తెరవంకc జూచి సశ్లాఘముగా) ఓహో! చెలికాcడా! చూడు
చూడు. అలంకరణోపకరణంబులం గొనివచ్చెడు చారుమతితోc బ్రవేశిం
యిదిగో దేవి యిక్కడ నున్నది.

రాజు— (చూచి సంతోషముతో) ఆహా! ఏమి!

చ. చెలి శరగారవుండకుcజెక్కులc గూర్పదు పత్రభంగి; వీ
నులc గడ కొత్తువాలికకనుంగవc దీర్పదు కజ్జలంబు; వే
నలి కుటిలంబు బ్రేలు; నరుణం బధరం బగు ధూసరం బిటుల్
పాలిచినc దాంటిదే సుషమ; భూషణమూం బగ నేయు నాc దగున్. ౧౪

శ్రీరస్తు.

శ్రీ పరమాత్మనే నమః.

---

# చండకౌశిక నాటకము

పొనరుచుఁ బెంచుఁ ద్రుంచు జగముల్ త్రిగుణాత్మత నీవిభుండె, యీ
యనవిత్తితాష్టమూర్తులనె వ్యాప్తము విశ్వము, లేఁడు వంద్యుఁ డీ
తని కనుమాడ్కిఁ, గంకణపుఁ ద్రాఁచుల ఫూత్కృతిఁ దూలి నర్తనా
దిని బవలగ్న మాపశుపతిప్రసవాంజలి మిమ్ముఁ బ్రోచుతన్. ౧.

చ. కనుఁగవ కెంపు బొమ్మముడి గల్గి దరస్ఫురితోష్ఠమౌ మొగం
బనయము నప్రసన్నహరిణాంకరుచిం బచరించఁగాత, మా
యనునయముల్ వృథా యిఁకఁ, దృఢాగ్రహ మొప్పెలుఁగావుతన్ మన
స్విని యనఁ, జేతి గౌరి యెదఁజేర్చ నశంకరుఁ డేలుతన్ మిమున్. ౨.

శా. ఆనందశ్లథమై సమాధుల, నమాన్యశ్రీ విలాసోల్లసం
బై, నైజోరువికారితన్ ద్రుటి వెలింబై భ్రాంతమై స్మేరమై,
జ్యానాదం బొనరించుచో మరుఁడు రూక్షంబై, కరుఁగం ఘృణా
స్థానంబై, రతి యేడ్వ సాస్ర మగు నీశప్రేక్ష లోమున్ మిమున్. ౩.

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు— అతివిస్తర మెందుకు? దుష్టామాత్యబుద్ధివాగురాలంఘనసింహరం
హుండును, భ్రూభంగలీలాసముద్ధృతాశేషకంటకుండును, సమరసాగరాంత
ర్భ్రమద్భుజదండమందరాకృష్టలక్ష్మీస్వయంవరవల్లభుండు నగు శ్రీమహిపాలదేవుని
యాదేశంబు గాంచితిని. పురావిదు లుదాహరించు నీ ప్రశస్తగాథ యాయన దే
గదా!

మ. అనుకూలుండయి యాశ్రయించి గహనం బౌనార్యచాణక్యనీ
తిని, మున్నందుల గెల్చి పుష్పపురిఁ బొందెం జంద్రగుప్తుండు; నం
టునఁ గర్ణాటతఁ గాంచువారి మరలం ద్రుంచెన్ భుజాదర్పమం
దనుఁ డౌ శ్రీమహిపాలదేవుఁ డతఁడైనాఁ డిప్డు నిక్కంబుగన్. ౪.

పారిపార్శ్వకుఁడు— (ప్రవేశించి) ఆర్యా! అమ్మహారాజు నాదేశ మేమి?

సూత్ర— సుప్రసిద్ధుం డగు విజయప్రకోష్ఠుని ప్రపౌత్రుం డార్యక్షేమేశ్వరకవి నవీన
ముగా విరచించిన చండకౌశిక నాటకముం బ్రయోగించుమనది యని. అమ్మహాకవి
నాట్యవేదవిశారదులును విద్యాకలానిధులును లోకజ్ఞులు నగు సభాసదులం గూర్చి
యిట్లు పలికి యున్నాఁడు.

క. దోసము లేశము లేనివి
యేసంబు గుణంబు లేనివియు లే వెందున్
దోసమును గప్పి పుచ్చుండు
భాసిలఁ జేయుండు గుణముఁ బండితులారా. ౫.

కావునఁ బారిపార్శ్వకా! కుశీలవులతో సంగీతము నారంభింప వేమి?

పారి—(సాశంకముగాఁ దల వాంచుకొని) ఆర్యా! ఆలకింపుఁడు. నాఁడు గ్రహణ కాలమున మీరు దక్షిణ యిచ్చెద నని మాటయిచ్చిన బ్రాహ్మణోత్తముఁడు, తదర్థము నేఁ డరుగుదెంచి కోపపడుచున్నాఁడునఁ గుశీలవు లందఱు వందురుచున్నారు.

సూత్ర—(భయము నభినయించి చింతను నటించి సహర్షముగా) మారిషా! ఈవిషయమున విషాదంపడ నేటికి? ఇదిగో నే నిప్పుడే—

ఆ. వె. అలిఁ జూలి నమ్మి యాత్మదేహము నమ్మి
సత్యపాలనంబు సలుపఁ బూనె
నియ్యకొన్న విత్తమిత్తు హరిశ్చంద్ర
పార్థివుండు వోలె బ్రాహ్మణునకు.

(తెరలో) వయస్యా! ఇటు, ఇటు.

సూత్ర—(తెరవంకఁ జూచి) ఓహో! ఏమి! హరిశ్చంద్రమహారాజే! మహోత్పాతసూచితంబు లగు నాపదలు కుశలపరిణామంబులుగాఁ బ్రారబ్ధధివిస్తరుండగు పురోధసుండు రహస్యంబున నుపదేశించిన నియమజాగరంబులం బొనరించి పర్యాకులమానసుం డగుతనకుం బ్రియవయస్యుండు బోధాయనుండు దారి చూప నంతిపురము వైపున కిటు బయలు వెడలినవాఁడు, చూడు—

చ. భరమగు తూఁగుచేఁ దొగరుపాఱినసోమరికన్నులం, బ్రజా
గరమున వాడుగేరుముఖకంజమునన్, విభుఁ డీతఁ డొప్పెడున్,
మరగినయాత్మయాధమును మాపటివేళను బాసి, రేపటన్
విరహకృశానుతీలను వేఁగుమహాగజరాజమో యనన్. ౬

కావున నక్కడకే పోదము రా (నిష్క్రమించుచున్నారు) ప్రస్తావన.

(తరువాత జాగరఖేదము నభినయించుచు రాజును విదూషకుఁడును ప్రవేశించుచున్నారు.)

విదూ—చెలికాఁడా! జాగారపుబడలిక గలకన్నులతో నీమదుద్గీర్ణముఖం బగు తాఁబేలునుం బోలె నున్మేషనిమేషంబులం గావించుచున్నను దారి గానక గు

## ప్రథమాంకము.

(తరువాత ముందు చెప్పినట్లు చింతను నటించుచు శైబ్యయుఁ జారుమతియుఁ ప్రవేశించుచున్నారు.)

చారు— దేవీ! ఇదిగో ప్రసాధనోపకరణము.

శైబ్య— (ఖేదముతో) ఓసీ! చారుమతీ! యిక్కడ నివి తీసివేయుము. నన్ను నే నెంతకఁ బరాభవించుకొందును? నా హృదయమున కీయలంకరణోపకరణాసక్తి నిరర్థకము

విదూ— అబ్బో! ఈమెది గట్టిపట్టే.

రాజు— బాగు! దేవీ! బాగు! నిసర్గమనోహరంబు లయిననీయవయవంబులకుఁ ప్రసాధనోద్దేశము నిజముగాఁ బరాభవస్థానమే చూడు.

మ. తరుణీ! నీ జిగిమోవి కానపడెనం దాంబూలరాగంబు; సుం
దరి! కందోయిని దిద్దఁ జెట్టుకొన నత్యాహంపమం గజ్జలం
బురుజక్షోరుహా! కౌఁగిలించుకొనఁగా నూహించు హారంబు కం
ధర; నీ కేటికి భూషణంబు లవి స్వార్థం బాశ్రయించు న్ననన్. ౧౫.

విదూ— మిత్రుఁడా! మనము సమీపింతము

రాజు— చెలికాఁడా! మన మిక్కడ దాఁగియుండి వీరివిస్రంభసంభాషణ మాలకింతము (అట్లు చేయుచున్నారు)

శైబ్య— చేటీ! చారుమతీ! అశ్వ్వథమున నూఁబడించియు మరల నన్నార్యపుత్రుఁడు విప్రలంభగోచరం గావించెను గదా! సర్వథా నాభాగధేయంబు లవిశ్వసనీయంబులు. వానికిఁకఁ బదివేల నమస్కారంబులు.

రాజు— ఓ మనస్విని!

క. ఘనపటలాంతరితుఁడుగా
నినుఁ డబ్జిని మోము ముడుచు, నేమియుపాలం
భన మయ్యెడు నయ్యది. యా
యన కెట్టులు విప్రలంభ మది పద్మినికిన్? ౧౬.

చేటి— దేవీ! నివిచారము మానుము. రాజులు బహుభార్యలు గదా!

విదూ— ఆ! బాగసమాఁతురా! బహుకార్యులని చెప్పుము. ప్రియమిత్రు నూరక యపదూఱుపాలు చేసెద వేల?

రాజు— చెలికాఁడా! దీనిమీఁదఁ గోపపడకుము.

క. సమయముఁ గని సఖుల కిదం
[illegible]

రమణుల విధ్యోపాలం
భమునకుఁ బాత్రత లభించు బహుపుణ్యులకున్.

శైబ్య— (ఏడ్చుచున్నది) ౧౬

చేటి— దేవీ! ఊరడిల్లు మూఱడిల్లుము. అతిమాత్రమైనయమాయికత్వము చేత నీవే మహారాజును మీఱుఁ బెట్టికదా సవు. అవ్వా! నీ విష్షను నన్నడిగితివా, విను. ఆయన నన్నుఁ జూచినను నీవాయనను జూడకుము. ఆయన నిన్నెంత మంచిమంచి మాటలతో బతిమాలుకొన్నను దడవుగ నీ వుల్లసములాడి యాయనను ఖేదపెట్టుము.

శైబ్య— ఆర్యపుత్రుని జూచినఁ గగలచ్చ డీపాదుమనస్సుమీఁద నాయధికారము సాగినపక్షమున నీమాట నీచెప్పినట్లే తప్పక జరిగించెదనే.

రాజు— (త్వరగా సమీపించి) ప్రియురాలా!

క. నీ కే నెపుడు విధేయుఁడ
నే కద, మత్పరత నున్న నీడెందముపై
నీ కేమిట నధికారం
బో కంజదళాక్షి! నాగ కిందును జెపుమా.

విదూ— దేవీ! శుభము. ౧౭

(ఇద్దఱును సంభ్రమముతో నిలుచున్నారు)

శైబ్య— (తనలో) ఓహో! ఆర్యపుత్రుడే! కానీ (ప్రకాశముగా) జయము జయము ప్రాణేశ్వర!

చేటి— (భయముతోఁ దనలో) అయ్యో! మహారాజే! నే నన్నమాట లీయన చెవిని బడి యుండును. కానీ. (ప్రకాశముగా) జయముజయము మహారాజ! దేవా! ఇదిగోఁ బీఠము. దేవర యిందుఁ గూరుచుండుఁడు.

(అందఱుఁ గూరుచున్నారు)

రాజు— (కడుదడవు దేవివంక విలోకించి) సుందరీ! ఇదిగో నిప్పుడు—

చ. దగగాని వేగుఁబోక విరిదమ్మిని దుమ్మెదకొమ్మ ప్రాలఁగా
నెగయు తెలుంగునన్ జిగినీనిక ప్రాలుదృగంచలంబుతో
సొగసుగ నాపయిం బొలయుచూపు గిఱుకున్నఁ గ్రమ్మఱించి తే
మగపడెఁ దన్వి! నాయెడ దయ స్మరలించెదు నేర మింతలో. ౧౮

మఱియు నోమనోహారిణి!

క. నగల ననాదరణము నీ
వగపఱిచినఁ గొదవ యొదవ దభిరామతకున్

జిగి మేనఁ గాని నా కది
మగువా! ప్రకటించు నీదు మదిమనికితముల్. ౨౦.

శైబ్య— నిద్రాలసంబు లైన యీయవయవంబులతోడను, ప్రజాగరమంథరంబు లైన యీ శోణ నేత్రంబులతోడను దేవరవారు మిక్కిలి చక్కఁగాఁ గనఁబడుచున్నారు గదా నామాట కేమి? (కోపము నటించుచున్నది).

రాజు— (తడవుగఁ దేఱిచూచి) ప్రియురాలా! అనుగ్రహింపు మనుగ్రహింపుము.

చ. మదనజయధ్వజంబు నుపమున్నగు వక్రపుబొమ్మ తీఁగ నీ
యెదుట నదేల తాండవవినోదము సల్పుచు నుండెఁ జండికా!
వ్యసనపవమానకంపిత పరిస్ఫుట బంధుకజాంధవంబుగా
నదరెదు నేల నీ కసమయంబున నిట్లధరోష్ఠబింబముల్. ౨౧.

(దోసిలిపట్టి)

ఉ. కమ్మ ప్రసన్న పూర్వకలుకన్ వహియించెద వేల కోపనా
యెమ్మెయి నెంచి తీవు నను నే నటు గానిది నమ్మవేని దం
డమ్ము విధింపు పోలఁటు నాకు గుణాగుణనిర్ణయమ్మునం
దు మ్మహనీయులౌ కులపతుల్ బలితంపుఁ బ్రమాణ మయ్యెదర్. ౨౨.

(ప్రతీహారి ప్రవేశించి)

ప్రతీ— జయము జయము మహారాజ! ఇదిగోఁ గులపతులసన్నిధినుండి యొక తాపసుఁడు వచ్చియున్నాఁడు.

రాజు— హేమప్రభా! ఆలసింపక సాదరముగాఁ బ్రవేశపెట్టుము.

ప్రతీ— దేవా! చిత్తము చిత్తము. (నిష్క్రమించెను)

(తరువాత శాంత్యుదకమును జేతఁ బట్టుకొని తాపసుఁడు ప్రవేశించుచున్నాఁడు)

తాప— (విస్మయముతో) ఓహో హో!

సీ. ఇది యేమి యాశ్చర్య మిందుబింబము క్రిందఁ బర్వంబు గాకె స్వర్భానుఁడొడిసి
యేమి మహాఘోర మీదిశావలయంబు కావిరుల్ గ్రమ్మంగఁ గాలఁ దొడఁగె
విడ్డూరమేమయో వెసందొంతులు వోలెఁ బృథుసౌధములు గూలఁ బృథివి యూఁగు
నెగసి యుల్కాదండ మే మిటు ఖండించె రెండుగా మార్తాండమండలంబు
దారుణోత్పాతములు గదా తలఁప నిన్న
గంచుదివియల వెదకినఁ గనికరంబు
గానఁగా రానిహతవిధికపట మకట
యేమి మూఁడింప నున్నదో యింక మీఁద. ౨౩

అయినను గురుజనులపరామరికవలన నివి యన్నియుఁ గుశలపరిణామములు కాఁగలవు.

తే. గీ. శాంతివలనను బ్రాహ్మణస్వస్తివాచ
నంబువలనను స్వస్త్యయనంబువలన
దానమున సజ్జనానుకీర్తనమువలన
తను మహోత్పాతదుస్స్వప్నశమన మగును.

అందుచేతనే మహానుభావులైనకులపతులు సర్వోత్పాతప్రశమనంబుగా నిజ రబ్ధస్వస్త్యయనకర్మశేషభూతంబగు నీ శాంత్యుదకమును రాజునకును రాణికి నిచ్చి రమ్మని నన్నంపినవారు

ప్రతీ— (ప్రవేశించి) అయ్యా! ఇటు, ఇటు. (సమీపించుచున్నారు)

తాప— (సమీపించి) రాజా! నీకు శుభము.

రాజు— (తొందరగా లేచి) స్వామీ! నమస్కరించుచున్నాను.

శైబ్య— మునీంద్రా! ప్రణమిల్లుచున్నాను.

తాప— రాజా! జయశాలివి గమ్ము. సాధ్వీ! వీరమాతవు గమ్ము.

రాజు— (తొందరగా) పీఠము పీఠము.

ప్రతీ— (పీఠము గొని వచ్చుచున్నది)

రాజు— స్వామీ! ఇదిగో పీఠము. కూర్చుండుఁడు.

(అందఱుఁ గూర్చున్నారు)

రాజు— హేమప్రభా! నీవు ద్వారముకడ నుండుము.

ప్రతీ— చిత్తము దేవా! (నిష్క్రమించుచున్నది)

తాప— రాజా! మహాత్ములయినకులపతులు తమయాశీస్సులవలన నుత్కృష్టప్రభా సంపన్నంబు గావించి నిజాప్రజాగరాంతంబునఁ గాంతాసహితంబుగా నీ శిరస్సునఁ జల్లుకొనుటకు స్వస్త్యయనశేషము నీ శాంత్యుదకము నంపినారు.

రాజు— (హర్షములో దోసిలిపట్టి) మహాప్రసాదము.

తాప— మ. శమితాంహస్స్వయమంత్రపూతమును బుష్యగ్ర్యాత్రతేజోనలం
బమితప్రోన్ముఖసుప్రపద్భవనసంప్రాగ్జసత్కర్మశే
షమునిర్వాచ్యమహత్త్వమీయుదక మైశ్వర్యంబు నీకిచ్చెడున్
బ్రమదంబుం బొదలించుఁ గాత మఖిలాపత్తుల్ నివారించుతన్.

రాజు — (స్పర్శను నభినయించి) ఆహాహా!

క. అంతఃపుత్రబీజమునకుం
గలుగం బ్రసవాంకురంబు కారణ మిది, వే
వేలుఁగుఁగొలము కేం గ్లెత్తుగఁ
దల దీనిప్రసాదమునఁ గద్యోయెత్తి రిలక్. ౨౬.

తాప— పూజ్యురాలా! శైబ్యా! కులగురులయాదేశంబున గృహదేవతలకును భూదేవతలకును సవిశేషముగా నీవును సమారాధనముల జరపవలయు.

శైబ్య— (దోసిలి పట్టి) స్వామీ! చిత్తము.

తాప— రాజా! నీకు శుభమవుఁగాక. నేను బ్రారబ్ధవివిధవిధివిస్తరులగు కులపతుల సంభావింప నరుగుచున్నాఁడ. (నిష్క్రమించుచున్నాఁడు)

శైబ్య— (వైలక్ష్యముతో) ఓసీ చారుమతికా! ఆర్యపుత్రునకు నిశాప్రజాగరము మహానుభావులు కులపతులే యాదేశించిరి. అయ్యో! నమ్మకము లేనియీపాడు మనస్సు నన్నెంత దురాత్మురాలిని జేసినదే. కానీ ఈలాగు చేసెదను. (దోసిలిపట్టి ప్రకాశముగా) ఆర్యపుత్రులు నన్ననుగ్రహింతురుగాక.

రాజు— (అనురాగముతో) ప్రేయసీ!

ఉ. చెన్నఁటితప్పిదానఁ గలుషీకృతచిత్తుఁడ నయ్యు నాకు నో
యన్నులమిన్న! నీయనునయం బిది గ్రాహ్యము యందు వేని, నీ
ప్రన్ననిచెక్కుటద్దములఁ బత్రములక్ రచియింతు ముత్తెపుం
బన్నసరంబుఁ గంబుసుషమం బగుకంఠమునక్ ఘటింపుచుక్. ౨౭

శైబ్య— (సిగ్గు వడుచున్నది.)

రాజు— (అట్లుచేయుచు) ప్రియురాలా!

చ. చెమరు గగుర్పు నీకు జిగిచెక్కుల, నాకు వడంకు గేల, నే
క్రమమున బ్రాయ నా మకరికల్? సకలంబు వృథా శ్రమంబు, హా
రము మెడఁ గూర్పఁగా నది తరంగిత మాచుఁ గుచాగ్రసీమఁ, గం
పమును మదీయహస్తసహవాసభవంబును మాన దుగ్మలీ. ౨౮.

శైబ్య— ఆర్యపుత్ర! కులపతు లానతిచ్చినట్టు లాచరింపఁ బోవుచున్నదానను. (ఇద్దఱును నిష్క్రమించుచున్నారు)

రాజు— మిత్రుఁడా! సోత్కంఠుఁడ నైననే నేలాగునఁ బ్రొద్దు పుత్తును?

హా— చెలికాఁడా! నీవు దేవిమాటలను జెప్పుకొనుచు సంతోషింపుము. నేనును భోజనప్రసంగముతోఁ గాలము పుత్తును.

వనచరుఁడు— ( ప్రవేశించి ) జే జే దేవరా ! అవధారు సామీ !

బెట్టిదపుఁ బుట్టియకొట్టుకొనం బిట్టు గ్రోడాడ తుంగపట్టులం బుట్టిన నెత్తావి వెల్లువపొత్తువం బెల్లు వలచునార్పు గాడ్పులం దంతయంత్రాంతరదళచర్వ్య మాణంబు లగుతెల్లనికొట్టిగడ్డలపిండి యిట్టట్టుఁ జెదరి విప్రకీర్ణప్రతిపక్షజయో పార్జితనిజయశఃపటలంబు నుం బోలెఁ గాలమేఘంబునం గురియుకరకవర్షం బునుం బోలె దశదిశాభాగంబులఁ గప్పఁ, బెద్దకాలంబునుండి మెండుకొనియున్న వేరంపుఁగారణంబునం జేసి రోసంబునం బూర్ణశశాంకమండలంబునుండి నిండు జలిమింగఁ గాయమాళంబుఁ బెకలించి కబళించెడు తుదిరేయిటికటికిచీఁకటిమొ త్తమ్మునుం బోలె దశనాంతరాళఖండనభయంకుఁడలాయితవృకాళిదండభా సురకరాళవికటదంష్ట్రాయుగళంబున ముఖమండలంబు భీ డింప, నేపారు కోపానలంబునిగమునుం బోలెఁ దరలతరజిహ్వాప్రవాళంబు గ్రాల, విద్రావిత వనసింహసంహతి యగునిజగర్వగంభీరఘుర్ఘురారావంబునం బెదరి తమతమ జాతి కనుగుణంబుగా పాపోవు నాభీశార్దూలాదివ్యాళజాలంబులకోలాహలం బాలకించి యాగ్రహించి ఆక్కించినకర్ణద్వయంబు ముత్తియపుఁజిప్పదోయిం జప్పటలు సలుప, రూక్షతరపింగాక్షివిక్షేపం బగునిశితకరవాలవిమలేంద్రనీల కజ్జలతమాలశ్యామలస్థూలకాయంబు స్ఫులింగశేషం బగుదవదహనమషీరాశి నీసడింప, వికటతటిచ్ఛటాకడారకేసరకలాపంబున నిరంతరపరిస్ఫుర ద్వనలగ్నదావానలోద్గారభాస్వరం బయి యవతారితధరావలయలీలాసము త్థితం బగుమహావరాహంబునుం బోలె నొకవరాహయూథాధిపతి మృగవ్య భూమిని బ్రవేశించెను. అవధరించి దేవర చిత్తానుసార మాచరింపుఁడు. నేను నక్కడకే పోవుచున్నాను

రాజు— ( సంతోషముతో ) ఆహా! నా కిప్పుడు వినోదస్థానము లభించినది.

విదూ— ( కోపముతో ) ఓహో! చలికాఁడ! ముల్లుకంపలలోను ఱెల్లుదుబ్బుల లోను బడి మిట్టుపల్లంబు లనక యాఁకలిడప్పులకు లోఁగుచు నడవులలోఁ దిరుగు లాడవలయుటం బట్టి బహుప్రత్యవాయంబు నాఁ జనువేఁటయే నీకు వేడుక పట్టయినపక్షమున నిఁక లోకములో నాయాసస్థాన మేది యుండును?

రాజు— మిత్రుఁడా! రాజులకు వేఁట యత్యంతోపకారకము గదా! చూడుము—

చ. అలఁదురు మానసంబునకు హాయి ఘటించుఁ; జలించులక్ష్యముం
దలపడుచుం స్థిరత్వ మఖిలాంగము లాఘవ మొందఁ జేయు; నై
కొ్కలుపుఁ గడంక బుద్ధిఁ; గలఁకుం బలె నెంతయు నారోగ్య మింతయుం

దలఁపక వేఁట సందు్రి వ్యసనం బిది రాజుల కంచుఁ బండితుల్. ౨౯.

కాఁబట్టి రా మన మక్కడకే పోవుదము.

( అందఱు నిష్క్రమించుచున్నారు)

గ. ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదలబ్ధసరసకవితాధురంధర వడ్డాదిసాధువంశక్షీర నీరాకరరాకాసుధాకరాచ్చనామాత్యపౌత్ర హరితసగోత్ర పవిత్రగుణకదంబ లక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల సూరపరాజప్రధానతనూభవ విబుధవిధేయ సుబ్బరాయనామధేయాంధ్రీకృతం బగుచండకౌశికనాటకంబునందుఁ బ్రథమాంకము.

## ద్వితీయాంకము.

---

(తెరలో) ఓహో వరాహాన్వేషులార!

మహాస్రగ్ధర.

కలఁచుం బంకంబుఁ, జెరించుం గమలిని, నమలుం గందళన్యస్తకంబుల్,
జల మీఁదుం గూల నొద్దుల్, స్ఫుటములుగ ముస్తాస్థలుల్ సల్పెఁ, దూలెం
బలుగోనం, దక్కెడక్కెఁ, బఱచుఁ బఱచు, వే భల్లకుల్ చిమ్ముఁడంచుం
బలుకుల్ వెన్నాడి గాలింపఁగఁ జూరఁబడెనుం బంది కాంతారభూమిన్. ౧

కాఁబట్టి యడవుల నెల్ల నరికట్టవలయును.

సీ. గహనావరోధధూర్వహజాలికులు జాలబంధంబులను బొంతఁ బన్నవలయు
భషకసంఘులు వనాభ్యంతరంబున జాగిలములపట్టెడ లెడల్పంగవలయు
నలయ వాజులు వనస్థలమెల్లను పాశహస్తులు రాహుత్తులలమవలయు
దండధుల్ పూనుదంతలరౌతు లంతకుల్ బలెఁ గాన గజిబిజింపంగవలయు
మందరాచలమంథానమథ్యమాన
కలశపాథోనిధానంబు దలఁపు రాఁగ
నధికవనసత్త్వ సంక్షోభ మావహిల్ల
ధీరలుబ్ధకవారంబు తిరుగవలయు. ౨.

(తరువాత రౌద్రోజ్జ్వలవేషుండయి సంభ్రమించుచు విఘ్నరాట్టు ప్రవేశించుచున్నాఁడు)

విఘ్న—(సాశంకముగాఁ దనతో)

చ. హరునిసమాధికిన్ శిపులయంగజకేళికి దత్తుసల్పన
దారకుని కంతరాయము నెవండు ఘటించె, జగత్త్రియిన్ నిరం

తరము సమాచరించెదు హితవ్యవసాయపుఁబంట మాపుణ్యే
పరమవిలాసమై యెవఁడు భాసిలు, నే నలవిఘ్నుఁడం గదా. ౩

కావున నే నిప్పుడు—

చ. జలజజశార్ఙ్గిశంభులయసాధ్యపువిద్యలు మూఁడు నుగ్రపుం
బలుపుఁదపంబునం బడయు వాఁ డగుతాపసునుండి ముజ్జగం
బులను సముద్ధరింతుఁ గిటిమూర్తిని గ్రీడమెయిం ధరించుచున్
బ్రళయమునందు నాదిమవరాహతనుండు ముకుందుఁడుం బలెన్. ౪

అట్లు చేయుట యుక్తమే గదా!

చ. భువనములన్ విధాత సలుపున్, హరి గాఁడు హరుండు గాఁడు; కే
శవుఁడు ధరించు గోప్త యని, శంభుఁడు గాఁడు విరించి గాఁ డుమా
ధవుఁడు హరించు హర్త యని ధాతృఁడు, గాఁడు విధుండు గా డసం
భవ మగుఁ గాక యొం డొకని పట్టున నెట్లఖిలంబు సిద్ధియా. ౫

(ఆలోచించి) అయినను బరమనైష్ఠికుఁ డగునీతనియం దసంభావ్య మొకటి యుం
డదు గాని మునిస్వభావంబులు సులభకోపంబు లనియుఁ గామక్రోధంబులు శ్రేయః
పరిపంథు లనియు నీకార్యంబునకుఁ గడంగితిని. ఫలిత మెట్లుండునో యెఱుంగఁ
జాలం.

(తెరలో) అతినిబిడవనాంతర్ధానగర్వితా! వరాహాధమ! ఉండుండుము.

చ. కనఁబడుచున్ నిమేషమునఁ గన్మొఱఁగుచు నో పిశాచి! మా
యను గయికొన్నచందమున నక్కట! యన్నెలయించి దవ్వగాఁ
గొని చనుదెంచి తేల మడుగుల్ వెయి? నీ విపు డింత ధ్రాడకం
టను బడి తేని దామరవనంబుల నింకిటఁ ద్రింప వెన్నఁడున్. ౬

విఘ్న— (విని హర్షముతో) ఓహో! ఇతఁడు సమీపించెనే. నే నిపుఁ డీలాగునఁ
బోయి యెవ్వటిమాయనే యవలంబించి కనఁబడియెదను. (సత్వరముగా నడచి
నిష్క్రమించుచున్నాఁడు.)

(తరువాత విల్లుపూని వెంబడించుట నభినయించుచు రథమెక్కి రాజును సారథి
యుఁ బ్రవేశించుచున్నారు)

రాజు— ("కనఁబడుచున్ నిమేషమున" అను పూర్వోక్తపద్యము పఠించుచు ముందు
చూచి సంతోషముతో) ఆర్యా! ఆర్యా! వరాహము మనకుఁ జేరువ నున్నట్టే
తోఁచుచున్నది. — చూడు.

చ. నవలుతటిం దొరంగుకవణంపుబిసంబులు గప్పె నీవన
క్షమను గలంగి పాఱునుదకంబులధార లివే సరస్తటిన్,
శ్రమగళితోరుఫేనముల శాద్వలముల్ శబలంబు లిందు, సాం
ద్రము ధృతమాస్త్ర సౌరభము తచ్ఛ్వసితంబుల మారుతం బిటన్. ౭

(మరల నిపుణముగాఁ జూచి సంతసముతో) ఆర్య! ఆర్య! ఇదిగో నది, చూడుచూడు.

ఉ. జోక పెడం గదల్చుకొనుచున్ వెసఁ ద్రవ్వినదుంపతోడిప
ర్యాకులలోలనాలదళచాబ్జము నోరమ బూని, లో నిగూ
ఢాకృతి యైననాభినల మానసపద్మముఁ జేర వెండి దం
ష్ట్రాకలితక్షమోద్ధృతిని గ్రాలుమహాకిటి నాఁ దనర్చెదున్. ౮

సూతు—(సకౌతుకముగా విలోకించి) ఆయుష్మంతుఁడా! చూడుచూడు.

మ. తిరుగం గ్రొవ్వున వచ్చి లక్ష్యమయి భీతిం దోన వెన్దీసి ముం
దరిపాదంబులు సాఁచి, కుంచచరమార్ధం బీడ్చుచున్ ముందుకున్
ద్వరితశ్వాసవిదీర్ణసృక్కవివరభ్రశ్యద్బిసాంకూర మై
విరిగోఱం దరిసించు నీ కన గతవ్రీడావిలక్ష్యాస్యమై. ౯

రాజు—(బాణమోక్షణమును నటించుచుసమీపించియంతటఁజూచియాశ్చర్యముతో) అయ్యో! యీనిమిషముననే మాయమై పోయినదీనిమీఁద ననవసరముగ బాణమోక్షణము గావించితినే.

చ. కనుమొఱఁగున్ క్షణంబు, క్షణకాలము దృగ్విషయం బగున్, మఱిన్
జనుఁ గడుదవ్వుగా, మరల సన్నిధియందుఁ జరించు, గ్రమ్మఱన్
వెనుకను బ్రక్క నంతటను వెండి భ్రమించు; మెఱుంగు వోలె ని
ల్వని దనుదీని నెక్కరణి లక్ష్య మొనర్తునొ తోఁప దేమియున్. ౧౦

(నిపుణముగా నరసి దూరము చూచి యానందముతో)
ఓహో! వరాహ మీమహారణ్య మతిక్రమించి ప్రసన్నభూమి నధిరోహించినది. ఆర్య, ఆర్య! గుఱ్ఱములను వేగముగాఁ దోలుము. ఇఁక నిదియెందు బోఁగలదు?

సూతు—(అట్లు చేసి రథవేగము నభినయించి) ఆయుష్మంతుఁడా! చూడుచూడు.

చ. వెనుకను బెండుమారమున వీచెడుగాలిని మీఱుచున్ వడిన్,
మానుమున లక్ష్యమున్ గలయఁబోయెడు నామది వెన్నడించుచున్,
దనయచలధ్వజాంశుకము దాఁకఁ బయోదము నీశరాళితో
డను సరి గాఁగ నయ్యుఱమెడన్ భవదీయరథంబు వ్రాలెడున్. ౧౧

రాజు—(విస్మయముతో) ఏమిది!

చ. చదలఁ జరించుచుం బవనజైత్రజవంబున నంబురాశి గో
ష్పదముగఁ జౌకళించురథవాజులతోఁ దనుఁ గూడమట్టుసా
కదిర! విభిన్నకజ్జలచయప్రతిమానవినీలకాయ మీ
కోదమవరాహ మర్త్యమునకుం దమమట్టులు దూరదూర మౌ. ౧౨

(ముందు చూచి ఖేదముతో) అయ్యో! యీమహారణ్యము నతిక్రమించి వెంటనే యదృశ్యం బయినదీనియడుగులజాడ యయినను గాన రాకున్నది. కానీ, ఇది కోనెట్టయెదుటఁ దిన్నగా నున్నయీయరణ్యరేఖ నిప్పు డన్వేషించెదను. (అట్లుచేయుచు సంతోషముతో) ఓహో! యిది తపోవనోపకంఠము గావలయు. నిశ్చయమే.

చ. ఒకయెడ వేళ్ళతో బెకలి రాల్కుడఁ గోసిరి దర్భబీళ్ళు; పూ
లకు దయ నందుకో రివటలం లత లిం దిసుమంత వంగె; నా
ల్పికొనుటఁజేసి వల్కలముఁ జెట్లట గాయపడెం; దొరంగుపాల్
ప్రికట మొనర్చు నీతరువరంబుల నిప్పుడె తుంచు టిధ్మముల్. ౧౩

(అంతటఁ జూచి సంతోషముతో) ఆర్యా! చూడుచూడు.

చ. చిలుకలు స్వాగతంబును వచించుఁ గదంబపుఁదొఱ్ఱబోదియం;
దలఁపు హరించు ఘ్రాణమును దన్పుచు హవ్యసుగంధవాయువుల్;
జలపులినప్రదేశజకుశం బగునిర్ఝరతోయ మీకురం
గులు మనవంకఁ గన్గొనుచుఁ గ్రోలు భయాతివిలోల దృష్టులం. ౧౪

సూతుఁడా! యాశ్రమోపాంతసంచారి యగునీవరాహము నిఁక వెదుకఁ దగదు. నీ విప్పుడు గుఱ్ఱములను నీరు ద్రావించి విశ్రమింపం జేయుము. ఇంతలో నేను నాయుధమాత్రసహాయుఁడనై యాశ్రమంబునం బ్రవేశించి తపోధనుల కభివాదనంబు గావించి వచ్చెదను. పూజ్యులకు సపర్యగావింపమి శ్రేయోవిఘాతంబుగదా!

సూతు—చిత్తము దేవా! (నిష్క్రమించుచున్నాఁడు)

రాజు—(చింతను నటించి సశ్లాఘముగా) ఆహా! యీబెడఁదల నెఱుంగమిం జేసి యీజడదారులమొగంబు లెంతరమణీయంబులై యొసంగుచున్నవి!

మ. గతసంకల్పతఁ గోరఁబోదు మది భోగంబుల్; మమత్వంబు వ
ర్జితమై యేగుటచే వియోగములపై స్నేహంబులుం గా వహం
కృతిఁ దూలించుట స్వాన్యభేద మనుమాటే లే దనిర్వాచ్య మౌ

(వినయముతో నడిచి భయ మభినయించి సాశంకముగా) అహో! యేమిది! అవి
నయదురాలోకంబు లైనయాతపోవనంబు లపూర్వంబు లగుటంజేసి సాపరాధుల
కుంబోలె సాధ్వసముం గలిగించుచున్నవి. తేజస్సులలోఁ సర్వాభిభావియు ననభి
భవనీయంబును నగుతపోమయబ్రహ్మతేజం బనిర్వచనీయంబు గదా!

క. అడుగడుగున జడు విడు నా
కడవి పరిశాంతము మనోజ్ఞ మయ్యును, మెత్తం
బడు నెల్లతేజములు తమ
పొడమినకడ నిప్పు నీటిపొందునఁ బోలెన్. ౧౬

(భయముతో నడుచుచున్నాఁడు)

(తెరలో) ఆర్యులారా! రక్షింపుఁడురక్షింపుఁడు. ఏయపరాధము నెఱుంగనియనాథ
ల మశరణ్యలము; అయ్యయ్యో! యతిదారుణముగా నగ్నిహోత్రమునఁ ద్రోయఁ
బడుచున్నారము. మందభాగినులను మమ్ము రక్షింపుఁడు రక్షింపుఁడు.

రాజు—(విని యవష్టంభముతో) ఓహోహో! చేరువ నీవైపున భయార్తిం గూ
రిన యాఁడువారలదియుం బోలె నంగలార్పువినవచ్చుచున్నది. (అచ్చెరువుతో)
ఏమిది! ఇది తపోవనమే. ఇటువంటి యవినీతుల కిక్కడ సంభవ మెట్లు? కా
నీ సమీపించెదను. (అట్లు చేయుచున్నాఁడు)

(తెరలో దొంటియట్లె వినఁబడుచున్నది)

రాజు—(విని సావష్టంభముగా) భయార్తులకభయ మభయము. (క్రోధముతో) హా!

ఉ. క్రూరుఁ డనాత్మనీన మతిఘోరము నీఖలకర్మముం దప
శ్చారివనీవిరుద్ధము నృశంసము నెవ్వఁ డొనర్చు, వాని నా
దోరసి గొంతుఁ గోసి మెయి తునకలుతునకలు చేసి యుజ్జ్వల
ద్భైరవవహ్నికీలలను భస్మముగా నవి యెల్ల వ్రేల్చెదన్. ౧౭

(నడచి తెరవంకఁ జూచి విస్మయముతో) ఓహో! యగ్నిహోత్రమధ్యంబున నా
సీనం బయి భయార్తత నంగలార్చుచు దివ్యరూపంబునం దేజరిల్లు నారీత్రయం
బుతో నన్నిహితహోమసాధనుం డయి యగ్నిశాలయం దున్నవాఁ డెవ్వఁ డయి
యుండును? నిజముగా వీఁడు తాపసవేషధారి యగుకొండొకపాపండుండు గా
వలయు. (తరువాత హోమము నభినయించుచు విశ్వామిత్రుండును, యథాని
ర్దిష్టముగా విద్యలును బ్రవేశించుచున్నారు)

విశ్వా—(ఆశ్చర్యముతో) ఓహో! యేమిచెపుమా.

ఉ. పూని హవిస్సు మంత్రపరిపూత ముపాంశున నే నొసంగఁగా
నైనను గాఁడు లేశము హుతాశనుఁ డియ్యెడ దక్షిణార్చి; హా
చ్చైనక్రియాపరిభావమున నద్దిర! యొద్దకు నేగుదెంచి రీ
చానలు విద్యలైనను వశంపడ కుందురు నా కిదేమొకో. ౧౭

(సమాధి నభినయించుచున్నాఁడు)

విద్య—(పూర్వోక్తము పఠించుచున్నారు)

రాజు—(సత్వరముగా నమీపించి) భయార్తులకభయ మభయము. అరే! దురాత్మ! పా
షండాధమ! నిలునిలు. ప్రచ్ఛన్నరాక్షసుండ వగునీమాయాప్రపంచ మిదియేమి?

ఉ. కేల వరాక్షమాల, తలఁ గెంజడలున్, మొల వల్కముల్, దప
శ్శాలుల దైనయీపరమశాంతపువాలక మేమి? యోరిచం
డాల! జుగుప్సితం బకరుణం బగు స్త్రీవధ, పాతకోత్సవో
ద్వేలమనం బిదే మనుభవింపుము కర్మఫలంబు నిప్డె. ౧౮

విశ్వా—(సంవరణము నభినయించుచుఁ గ్రోధముతో)

మ. అసకృత్కర్ణకఠోరభర్త్సనమిషవ్యాఘట్టజం బాంతర
ప్రసభక్షోభసమాధిభంజననభస్వద్భాస్వరద్దీప్తి నా
యసదృక్క్రోధజజాతవేదుఁడు సమిత్ప్రాప్తిన్ భయస్పర్శన
ప్రసరోద్యత్ప్లలయాగ్ని నాఁ ద్రిభువనగ్రాసేచ్ఛ నేఁ డీఁగుతన్. ౨౦

విద్య—(సంతోషములో) మాకుఁ బ్రియము, మాకుఁ బ్రియము, జయముజయము
హరిశ్చంద్రమహారాజ! (నిష్క్రమించిరి)

విశ్వా—(చూచి క్రోధములో) అహా! యేమిది! దురాత్ముఁ డీహరిశ్చంద్రుఁడే
మాకు శ్రేయోంతరాయుఁ డైనాఁడు. అరే! క్షత్రియాధమ! నిలునిలు.

ఉత్సాహ. హరివి యగుదు గాక, చంద్రుఁ డగుదు గాక, చంద్రమో
ధరుఁడు హరుఁడె యగుదు గాక, దాని కేమి మూఢ, యీ
పరమవిద్య లంతరింపఁబట్టి బెట్టిదంబు గా
నెరియునాదుక్రోధవహ్ని కింధనంబు గావు రా. ౨౧

ఓరోరిదురాత్మ!

శా. జాయాకేళిమయుండు భూతకరుణాశాంతుండు డా నయ్యుఁ గ్రీ
డాయత్తాత్మసమాధిభంగవిరసాన్యభ్రూకుటీభీషణుం

దై యాకృష్టశరాసు మారుఁ గని ఫాలాక్షుం డెటుల్ చేసెనో
చేయం గౌశికుఁ డట్లె నిన్నిపుడు దృష్టిం గ్రోధభూయిష్ఠుఁ డై. ౨౨

రాజు—(సంభ్రమించుచుఁ దనలో) అయ్యో! యేమిది! ఈయన భగవానుఁడు కౌశికుఁడా? వారు పూజ్యురాండ్రు విద్యలా? వారిసిద్ధికిఁ బాపాత్ముఁడను నే నీయన కంతరాయ మైతిని గదా! నిజముగా నింధనపాత్రయుఁడను నే నవివేకంబునఁ బ్రస్ఫురచ్ఛిఖాకలాపం బగు జ్వలనంబును ద్రొక్కితిని.

విశ్వా—(క్రోధముతో)

చ. కడఁగినసాధనం బిటు విఘాతము నొందుటఁ గ్రోధమెచ్చి నా
కుడిచెయి గాంచుశాపమునకుం గడు వేగిరపాటు; నెన్నఁడో
విడిచిన దల్లజాతిఁ దలపెట్టుచుఁ దానును సాహసాంక మీ
యెడమకరంబు చాపమున కెంతయు నేడ్తెఱ సేయు నిత్తఱిన్. ౨౩

(లేచుచున్నాఁడు)

రాజు—(భయముతో సమీపించి) స్వామీ! నమస్కరించుచున్నాను.

విశ్వా—(క్రోధ మభినయించుచున్నాఁడు.)

రాజు—(పాదములం బడి) భగవానుఁడా! క్షమియింపుము క్షమియింపుము. స్త్రీజనార్తప్రలాపమాయావంచితుండ నయి యెఱుంగనివాఁడ నయిన నన్ను క్షమియింపం దగును.

విశ్వా—ఏమీ! "యెఱుంగనివాఁడ నయిన నన్ను క్షమియింపం దగు" ననెదవుగా; ఓరోరిక్షుద్ర! నన్నే నీ వెఱుంగవు గా!

ఉ. జాతిస్వయంగ్రహంబున నెసంగిన దుర్లలితైక విప్రుఁడన్
బోతరపున్వసిష్ఠముని పుత్రులకానకు వీతిహోత్రుఁడన్
నూతనసర్జనోద్యమ వినోదనభీతజగత్కృతాంతుఁడన్
ఖ్యాతమతంగయాజకుఁడఁ గౌశికుఁడన్; నను నీ వెఱుంగవో. ౨౪

రాజు—తాపసోత్తమా! ప్రసన్నుఁడ వగుము. ప్రసన్నుఁడవగుము. స్వామీ! నీ వీలాగున ననుకోఁ దగునా?

ఉ. అన్నము లేనికాటకమునం దటు జీవిక గన్నవాని, భూ
భృన్నివహప్రతిగ్రహణవృత్తికిఁ జిత్తము రోయువాని, నో
యున్నతకీర్తి! యాడిబకసంగరకంపిత జీవలోకునిన్
నిన్ను మహాస్తపోనిధిని నేల నెఱుంగనివాఁడు గల్గునే. ౨౫

భీరుజనార్త ప్రలాపంబు నాలకించి యాలాగునఁ గావించితిని, స్వధర్మాక్షిప్త చేతసుం
డనయి యెఱుంగనివాఁడ నయిన నన్ను క్షమియింపం దగు నని విన్నవించుకొను
చున్నాను. మహానుభావ!

విశ్వా—ఏమీ! "స్వధర్మాక్షిప్తచేతసుండవా? దురాత్మా! చెప్పు చెప్పు. ఏదో నీ
ధర్మము?

రాజు—మునికులోత్తమ! మనవి చేసికొనుచున్నాను. చిత్తగింపుము.

క. ఈయంగవలయు, రక్షణ । సేయంగనువలయు, రణము సేయఁగవలయుక్;
రాయలకు నిత్యధర్మం । బీయది యని పలికి రాదిఋషిమూర్ధన్యుల్. ౨౬

విశ్వా—ఏమీ! "ఈయంగవలయు" ఇత్యాది పద్యము పఠించుచున్నాఁడు.

రాజు—మఱేమి?

విశ్వా—అట్లయినం జెప్పు—ఎవని కీయవలయు? ఎవ్వాని రక్షణ సేయవలయు? ఎ
వ్వనితో రణము సేయవలయు?

రాజు—భగవానుఁడా! ఆలకింపుము.

విశ్వా—ఊఁ, మఱి చెప్పు.

రాజు—క. ఈవలయును సద్ద్విజులకుఁ, । గావవలె భయార్దితులఁ,బగఱతో రణముం
గావింపవలయు; నీయది । భావముదృఢపఱుచుకొన్నపద్ధతినాకుక్. ౨౭

విశ్వా—మహాత్మా! నీ వట్లే దృఢపఱుచుకొన్నపక్షమున మాకు విద్యాతపోఘ్నరూపము
గా నే మయినఁ గొంచె మొసంగవలయు.

రాజు—(సంతోషముతో) ఓహో! భగవానునిచే వైవస్వతవంశ మనుగృహీతము
గదా! స్వామీ! ప్రసాదింపుము ప్రసాదింపుము.

ఉ. దేవర సత్కరించుటకు దిన్నగ, లోకము లన్ని చాల విం
తావల నేమి యుండు? బిడియం బగు నాయఖిలంబు నిత్తు నా
నోవిబుధాగ్రణీ! యయిన నోపినయీవి ప్రతిగ్రహింపు మీ
భూవలయంబు సర్వధనపూర్ణ మశేషము నీ కొసంగితిక్. ౨౮

విశ్వా—(ఆశ్చర్యముతో తనలో) కానీ నే నీలాగు చేసెదను. (ప్రకాశముగా) రా
జా! స్వస్తి. నరియేగాని యదక్షిణపుదాన మందురు. కావున దక్షిణ కూడ నిప్ప
డీయవలయును.

రాజు—(సిగ్గుపడుచుఁ దనలో) ఈయెడఁ జేయఁదగిన దేమి? (చాలఁగ నాలోచించి
సంతోషముతో) కానీ. ఈలాగునఁ జేసెదను. (ప్రకాశముగా) ఓమహాభాగ!

క. గడియించి లక్షహోమము । లిడుకొనిమొద దక్షిణగ ఋషీశ్వర మీకున్
దడ వనక కనికరంబున । గడు వానంగుండు నేఁడు మొదలుగా నెల నాకున్. ౨౯

విశ్వా—ఈ గడువు మాకు సమ్మతమే కాని పుడమిని విడిచి యొందుకడం గడియించి యొసంగవలయు.

రాజు—(సాశంకముగాఁ దనలో) ఇందుకుం బ్రతివిధాన మేమి? (ఆలోచించి హర్షముతో) ఓహోహో! ఎంతచక్కని ప్రతిక్రియ స్ఫురించినది. విశ్వేశ్వరపరిగ్రహం బయిన మహాక్షేత్రము గలదు గదా!

చ. తలఁచుచు వారణాసివసుధాతలభోగవిభిన్న భావమున్
బలుకుదు రంతరిక్షమునపట్టణ మంచును దానిఁ గోవిదుల్;
దెలియుదు రాగమార్థచరవృష్టిఁ గచాగ్రసహస్రభాగ సూ
క్ష్మలవతులాంతరాళమును సంయమివర్యులు శ్రద్ధధానులై. ౩౦

కాఁబట్టి యీయనదక్షిణ నే నం దార్జించి యిచ్చెదను. (ప్రకాశముగా) స్వామీ!
తమయాజ్ఞకు బద్ధుండను.
(ఆభరణములను దీసి) మహాత్మా!

ఉ. ఈయఖిలంబు లైనసిరు లీవసుధావలయం బశేష మీ
యాయుధముల్ సమస్తము, ధరాధిపలాంఛన మీకిరీటమున్
మీయవి; నే నిదే మరల మీమృదులాంఘ్రుల కప్పగించితిం
జూ, యమివర్య! సాదరపుఁజూపున వీని ననుగ్రహింపరే. ౩౧

(పాదములం బడి లేచి సంతసముతోఁ దనలో) ఆహా! ఆయానభూయిష్ఠం బయిన నదృష్టవశంబున రాజ్యభార మిప్పుడు నాకు సఫల మయినది.

ఆ.వె. ఎడఁదన్నేది పెద్దపిదు గనుకొంటినో । యట్టిగాధితనయు సాగ్రహంబు
చల్లచల్ల జాజి జాజిపూవులదండ । యగుచు నాదుశిరమునందుఁ బడియె. ౩౨

(దోసిలిపట్టి) భగవతీ! వసుంధర! ఇదిగో! నిన్ను వీడుకొనుచున్నాను.

ఆ.వె. దేవి! లోకధాత్రి! వైవస్వతులు నృపుల్ । వీరకీర్తి నేలినారు నిన్ను;
నరిదిపాత్రమునకు మరగి నే విడిలి; నా । యేకదోష మిది సహింపవలయు. ౩౩

ఇఁక నేను త్వరితముగా నయోధ్యకుఁ బోయి కౌశికప్రతిశ్రుతంబును సంపూర్ణ పఱిచి దక్షిణోపార్జనంబునకయి వారాణసి కేగెదను.

(ప్రకాశముగా) మహానుభావ! తమ రిప్పు డయోధ్యకు విజయంచేసి నన్నుఁ గృతకృత్యునిం గావించి దక్షిణాసంపాదనంబున కనుమతియిచ్చి యంపవలయు.

విశ్వా—(ఆశ్చర్యముతోఁ దనలో) అహో! ఈదురాత్ముని మనస్థైర్యము! ఏమీ! వీనిమహానుభావత్వము! ఆ! దురాత్మ! అచిరకాలముననే నీబింకము నేను వీక్షించెదను.

ఉ. ఓరిమదాంధ! యెందనుక నుజ్జ్వలరాజ్యవిభూతికిం బలెం
బోరపుసత్యసంపదకుఁ బోడన పాసినవానిఁగాఁగఁ గ
న్నార నినుం గనంబడయ నందనుకన్ భవదీయ దుర్నయో
దారత బగ్గుబగ్గను మదాగ్రహ మాఱదురా దురాత్మకా. ౩౪

(ప్రకాశముగా) రాజా! అలాగే కానీ. ఏమి దోషము.

(నిష్క్రమించుచున్నారు.)

గద్య. ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదలబ్ధసరసకవితాధురంధర వడ్డాది సాధువంశక్షీరనీరాకరరాకాసుధాకరాచ్చనామాత్యపౌత్ర హారితసగోత్ర పవిత్రగుణకదంబలక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల సూరపరాజప్రధాన తనూభవ విబుధవిధేయ సుబ్బరాయ నామధేయాంధ్రీకృతంబగు చండకౌశికనాటకంబునందు ద్వితీయాంకము.

---

## తృతీయాంకము.

(తరువాత బీభత్సవేషముతోఁ బాపపురుషుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

పాప—(వికటముగా నడుచుచుఁ బెద్దనవ్వునవ్వి తనలో)

క. ఆరంభమధురుఁడ నతి। ఘోరవియోగాధిశుగ్రుజామధ్యుఁడ నా
నారూపనరకబాధా। దారుణపరిణాముఁడను గదా పాపుండన్. ౧

(ముందు చూచి భయపడి తొలఁగి) కట్టా! పేరెత్త నయిన వల్లగాని యీవల్లకాటిపట్టణము నాదుంపదెంపినది. నన్నుఁ గడతేర్చినది. ప్రవేశముమాటయటుండఁగాఁ దుట్టతుదకుఁ గన్నెత్తి దీనిఁ దేఱి చూడ నయినఁ జాలకున్నాఁడ. అమ్మా! నే నేమి చేయుదు? (ఆలోచించి) కానీ నే నిక్కడ నేకతంబ యుండి జన్మాంతర సంచితుని నన్ను విడిచి యిందుఁ బ్రవేశించిన జనులను దిరిగి వచ్చునప్పుడు వెన్నంటెదను.

(తెరలో)

చ. అవుదల శంఖపాద జలజాంకన మాయన కంతవేఁగు మా
శివమును బుత్రవత్సలత, సిద్ధతపం బతనుశ్రుతంబు నా

కివి యిటు లున్నఁ గిల్బిషము లెమ్ములుఁ దోలున మాయఁబడ్డ జీ
ర్ణవపు విధే మలంఘ్య పరిణామము ప్రాక్కృత కర్మ మేరికిన్. ౨

(సావష్టంభముగా) ఆ! అది యాలాగే గదా! * (విస్మయముతో) ఎవఁడురా యిక్కడ మాటలాడుచున్నాఁడు. (తెరవంకఁ జూచి) ఓహో! భగవానుఁడయిన విషమలోచనుని యాసన్నపరిచారకుఁడు భృంగీశ్వరుఁ డిదిగో నీలాగున వచ్చుచున్నాఁడు. నేను త్వరితముగా నవ్వలకుం బోయెదను.

(నిష్క్రమించుచున్నాఁడు.)

(తరువాత భృంగీశ్వరుఁడు ప్రవేశించుచున్నాఁడు)

భృంగి—(అవుదల శంభుపాదేత్యాది పఠించి యాలోచించి) దీని కన్యథాత్వంబు గలదా? రాజర్షియయిన హరిశ్చంద్రునకును దశావిపర్యయము ప్రాప్తమయినట్లు దేవర దేవేరికిం దెలియఁబఱిచెను.

ఉ. ఆనతి యిచ్చుచో నధిపునద్భుతమైనచరిత్రఁ, జిక్లనై
మ్మె నిడువెంద్రుకల్ పొడమి మేఁగినబూదియ శూలికిం; దదీ
యానన మాచలద్భ్రునయనాంబురుహత్రయమయ్యె; మౌళియున్
బూనినపూపరేవెలుఁగుఁబూ వసియాడఁ జలించె మాటికిన్. ౩

ఇప్పు డాచక్రవర్తి యిటకు రాఁగలఁ డని దేవీసహితము భగవానుఁడు ఫాలలోచనుఁడు పర్యుత్సుకుఁడయి యున్నవాఁడు. నేనును శీఘ్రముగా భగవదారాధనము నిర్వర్తించుకొని యావేడుకఁ జూడ సిద్ధముగా నుండెదను. (నిష్క్రమించుచున్నాఁడు)

(తరువాత విచారముతో రాజు ప్రవేశించుచున్నాఁడు)

ఉ. ప్రీతిని మౌని కిచ్చి పృథివిం దనివిం గనుమానసం బని
ర్యాతితదక్షిణం దలఁచి వ్యాకుల మయ్యెడు; నాకు నార్జనం
బాతనిరాజ్యమందుఁ దగనందునఁ దజ్ఞులు ధాత్రి నాని సై
పాతకహారియౌ శివనివాసముఁ జేరుదుఁ గాశికాపురిన్. ౪

(చింతను నటించి నిట్టూర్పు విడిచి) అక్కటా! ఎంతకష్ట మెంతకష్టము!

మ. అవశిష్టంబు త్రయంబు త్యాగమున కీయాలుం గుమారుండు మే
నవధిన్ లే దిఁకఁ, గ్రోధి గాధిసుతుఁ డత్యాజ్యంబు సత్యంబు, భూ
దివిజస్వోపహతంబు గాన విడ నైతిం గాదయో! జీవ మే
మి వొనర్పంగను బాలువోదు మది కేమేలన్ దిశల్ శూన్యముల్. ౫

(ముందు చూచి సంతోషముతో) ఓహోహో! ఇదిగో. వారణాసి. తల్లీ! వారా

ణసి ! నమస్కరించుచున్నాను. (ఆలోచించి యాశ్చర్యముతో)

చ. తపముల బ్రహ్మచర్యముల దాంతిశమానశనవ్రతంబులన్
క్షపితతముల్ వరింతు రెది సన్యసనంబుల బ్రహ్మనిష్ఠు ల
ట్టిపరమతారకంబు శివుఁడే యుపదేశ మొసంగుఁ బ్రాణికిన్
వపువుఁ దొరంగుచో నిటఁ బునర్జననం బిఁక లేక యుండఁగన్. ౬

చ. నడలనిచావుపుట్టువులనం కెల యాడును బ్రాణికిచ్చటన్ ;
మృడునికరంబునుండి పడియెన్ మును బ్రహ్మశిరంబు నీడ ; ని
య్యెడ నవిముక్తుఁడై యభవుఁ డేనముఁ బాసి వసించు జాయతో ;
విడువఁడు దీని నెప్పుడును ; వే ఱొక టింతటి క్షేత్ర మున్నదే ? ౭

నే నిం దేయుపాయంబున మునిఋణంబునకుఁ బాయఁగలవాఁడ (విచారముతో)

మ. ధనదుం గెల్చి గ్రహింతునో ధనము, శ్రీ త్యక్తంబు నా కేల గె
ల్పను వా యాచన జన్మిగట్లు కది చేయర్ దీనతన్ క్షత్రియుల్ ;
ధనమూలంబు బెహార మున్న దది పేదన్ సాగునే నాకు ? నే
పనికిం గాల మపేక్షణీయ మది యొర్వన్ దైవయోగంబునన్. ౮

అయ్యో ! మందభాగ్యుఁడను నే నేమి చేయుదును ? (ఆలోచించి సంతోషముతో)
ఓహూ హూ ! దొడ్డయుపాయము తోఁచినది. నే నిప్పుడు.

క. అమ్ముకొని నన్ను నేన । త్యమ్మును బాలింతు శాశ్వతమ్ముగ ; నదుపా
యమ్మన నది ప్రోవమి ని । క్కమ్ముగ లోకద్వయమ్ము గావమి గాదే ? ౯

(సావష్టంభముగా) కుఱ్ఱవాఁడు లోహితాస్యుఁడు వెనుకఁజిక్కఁగావానికొఱకుఁ బ్ర
తీక్షించుచు దీర్ఘాధ్వవిశ్రాంత యగుదేవి నన్ను నింకను గలసికొన లేదు. ఆమె రా
కమున్నే నేను సత్వరముగాఁ బోయి నాకోరిక తీర్చుకొనియెదను. (పైకిఁ జూచి)
అబ్బో ! అప్పుడే ప్రొద్దు నెత్తిమీఁదికి వచ్చినదే.

ఉ. చండకరుండు కౌశికునిచందమునం దపియించుఁ దీఁడ్రమై ;
మండెడుఁ దెర్వు నామనసుమాదిరి ; దైవవశంబునం గటా !
యెండను మాఁడిమాఁడి కృశియించినదేవియుఁ బోలె భూమిరు
ట్షండముక్రిందికిం జనియె ఛాయయు నీయెడ మెల్లమెల్లగన్. ౧౦

కాఁబట్టి యిప్పుడు గడువునకు—గాదు కాదు—హరిశ్చంద్రునకే, యవసాన మాసన్నమై
నది. హా ! మందభాగ్యుఁడను నేను నశించితిని గదా ! (భూమిమీఁదఁ బడి తిరిగి లే
చి దుఃఖముతో) ఓరిదురాత్మ ! హరిశ్చంద్రహతక !

తే. గీ. మున్నుగా బ్రాహ్మణున కియ్యకొన్నయట్టి । దక్షిణను నీక బ్రహ్మస్వదగ్ధుఁడవును
సత్యచలితుండ వగుచు నేచాయ కీవు। సురుఁగువాఁడవురా యోరిపరమ శఠుఁడ.

నే నిప్పు డంగడివీథికిం బోయి ప్రకృత మనుసరించెదను. ఇంతకు నమ్మహాముని వచ్చి యుండ న్నోపును. (త్వరితముగా నడచి యేకాంతమున నున్నాఁడు)

(తరువాతఁ గోపముతో విశ్వామిత్రుఁడు ప్రవేశించుచున్నాఁడు)

విశ్వా—(తనలో)

చ. కరగత లైనవిద్యలవిఘాతముచేతఁ బ్రవృద్ధ మై మదీ
యరుష, శఠుండువానివినయాన్వితవృత్తి నిరుద్ధ మౌచు, లో
దరికొను నెండుఁగట్టియలఁ దద్దయు మండుదవంబు, పైపయిం
గురిసెడు వానలం దడియుకోనను బోలె ననుం దహించెడున్. ౧౨

(కోపముతో) దురాత్మ! హరిశ్చంద్రహతక!

ఉ. ఓరిమదాంధ! యెందనుక నుజ్జ్వలరాజ్యవిభూతికిం బలెం
దోరపు సత్యసంపదకుఁ దోడన పాసినవానిఁ గాఁగఁ గ
న్నార నినుం గనం బడయ, నందనుకన్ భవదీయదుర్నయో
దారత బగ్గుబ గ్గనుమదాగ్రహ మాఱదురా దురాత్మకా. ౧౩

(చూచి విస్మయముతో) ఏమీ! యిదిగో దురాత్ముఁడు—పోనీ మహాత్ముఁడే—వీఁడు వచ్చినాఁడే. సమీపించెదను.

(అట్లుచేసి క్రోధముతోఁ బ్రకాశముగా) అపురా! యేమిది! మాదక్షిణాసువర్ణము లిప్పటికి నీయ కున్నాఁడవు!

రాజు—(సంభ్రమముతో) ఓహో! భగవానుఁడు కౌశికుఁడే. స్వామీ! యభివాదనము చేయుచున్నాఁడను.

విశ్వా—ఛీ! యనార్య! నీ విప్పుడును మమ్ము శుష్కప్రియములతో వంచింప నెంచుచున్నావురా?

రాజు—(చెవులు మూసికొని) స్వామీ! శాంతింపుశాంతింపుఁడు.

విశ్వా—(క్రోధము నభినయించుచు) ఛీఛీ! దురాత్మ! అలీకదానసంభావనాప్రఖ్యాపితమిథ్యాపౌరుషప్రపంచ! ఉండుండు.

చ. నెలయును నిండెనం గడువు నీ విడ వింకను మాదుదక్షిణన్;
వలవనిశుష్కపున్మధురవాక్కులతో నిటు డాయు చుందు వో
పలువ! ప్రతిశ్రుతం బయినపైకము నీయమి నగ్ని యిచ్చువ
జ్జ్వలితకృశానుఘోరతరశాపము నీపయి నిప్పుడే పడున్. ౧౩

రాజు—(సంభ్రమముతోఁబాదములమీఁదఁ బడి) స్వామీ ! శాంతింపుశాంతింపుఁడు.

క. తాపసవర ! మీదక్షిణఁ । బ్రాపింపర యేని ప్రొద్దు వడకుండంగన్
శాపార్హుఁడొ యీమనుజుఁడు । వ్యాపాదార్హుండొ మీకు స్వాధీనుఁ డటన్. ౧౪

కావునఁ బ్రసన్నుల రయి వణిగ్వీధికిం బోవుదము రండు.

విశ్వా—(శాపజల ముపసంహరించి) కానీ, అక్కడ కేపోయియిమ్ము. ఇంతలో నేనును ద్వితీయస్నానము నిర్వర్తించుకొని వచ్చెదను. (నిష్క్రమించుచున్నాఁడు)

రాజు—(నిర్వేదించుచుఁ దనలో)

క. పరిణామదారుణం బిహ । పరభయకారణము ఋణము ప్రాణుల కిస్సీ
పరికుపితధనికముఖముం । దరిసింపనినరుఁడొకండె ధన్యుఁడు పుడమిన్. ౧౫

(నడచి సంతోషముతో) ఓహెూ ! యిదిగో ! వణిగ్వీథి (శిరమునఁద్తృణ ముంచుకొని ధైర్యముతో) ఓహెూ ! సాధులార !

క. ఒదవి యొకానొకయక్కఱ । యది దీఱుచునట్టివెఱపాయము లేకే
నిదె లతుహోమములకుం । గొదుకక యీదేహ మమ్మకొనుచున్నాఁడన్. ౧౬

ఆర్యులారా ! కొనుండి నన్నుఁ గొనుండి. (ఆకాశమున) ఏ మనియెదరు ? ఎందు కీదారుణకర్మము నారంభించితి వందురా ? నన్నిట్లు మీరేల నిర్బంధించెదరు ? ఈ జీవలోక మతివిచిత్రము గదా ! (వేఱొకచోటి కేగి "ఒదవియొకానొక" అనుపద్యము చదివి యాకాశమున) ఏమనియెదరు ? "నీశక్తియేమి ? పని యేమి ? జ్ఞాన మేమి ? " యని యడుగుచున్నారా ? (చిఱునవ్వుతో)

క. దేవర యేపని వెట్టినఁ । గావించెదువాఁడ నౌను గా దనకమదిన్
సేవకునకు దొరయానతి । యావంతయు మీఱమియకదా సుగుణ మగున్. ౧౭

(ఆలకించి) ఏ మనుచున్నారు ? నీవు వెల యెక్కుడుగాఁ జెప్పినాఁడవు. కాఁబట్టి మఱి యొకబేరము చెప్పు మందురా ? (ఖేదముతో) ఓసాధులార ! మేము క్షత్రియులము. మరలమరల బేరములుచెప్పుట యెఱుంగము. మీరు వెడలి పొండు. (వేఱొక చోటి కేగి "ఒదవి యొకానొక" అనుపద్యము చదువుచున్నాఁడు.)

(తెరలో) ఆర్యపుత్ర ! ఆత్మంభరుండవు గాకుము. అట్లు నీతో సుఖంబునఁ బాలిదాన నైననన్ను మందభాగినిం జేసి నేఁడు సంవిభాగపరాఙ్ముఖుండ వగుట పాడి గాదు. నాథా ! ప్రసన్నుండ వయి నన్నే యీకార్యమునకు నియోగింపుము. నీప్రణయ మిప్పుడు నయితము నెప్పటిదే గదా !

రాజు—(వైలక్ష్యముతో) అయ్యో! దేవి వచ్చినదే, సాకేరిక సెలవేఱినది కాదు.

(తరువాత బాలకానుగమ్యమాన యయి వైక్లబ్యము నటించుచు శైబ్య ప్రవేశించుచున్నది.)

శైబ్య—(సకరుణముగా నార్యపుత్రేత్యాది పఠించుచు మెల్లగానడచి) ఆర్యులారా! సమయదాసినిగా నన్నుందలినగమువెలకు విలుచుకొనుఁడు.

బాలకుఁడు—ఆర్యులారా! నన్నుఁ గూడ విలుచుకొనుఁడు.

రాజు—(వేఁడినిట్టూర్పు పుచ్చి తనలో) అన్నా! యెంతకష్ట మెంతకష్టము!

మ. చతురంభోధిపరీతభూతలమహాసామ్రాజ్యముల్ వీడితిన్;
హితులం బాసితి నశ్రుదీనముఖులన్; నే నూఱడింపం బ్రజన్;
సతి పుత్రుం డిపు డమ్ముకోఁ దమ్ము నిటుల్ సైరించి చూతుం; గటా!
శతధా వ్రయ్యదు గుండె, ధాత యిది వజ్రానన్ వినిర్మించెనో. ౧౪

శైబ్య—(బయ లాలకించి) ఆర్యులారా! యే మనెదరు? సమయ మే మనియా? పరపురుషపర్యుపాసనంబును, బరోచ్ఛిష్టభోజనంబును బరిహరించి మఱి యేకార్యమైనను జేయుదానను. ఇదియే నాదుసమయము. (మరలఁ జెవి యొగ్గి) ఏ మనియెదరు? ఈసమయమున కొడంబడి నిన్నెవఁడు కొనునందురా? అట్లయినచో మీ రనుగ్రహించి వెడలి పొండు. ఈజనముతో మీ కేమిప్రయోజనము? ఎవ్వఁ డేని దీనజనానుకంపి యగుభూనిలింపుఁడు సాధుశిఖామణి నన్నుఁ గొనఁగలఁడు.

(తరువాత నుపాధ్యాయుఁడును వటుఁడును బ్రవేశించుచున్నారు.)

ఉపా—వత్స! కౌండిన్య! నిజముగా నంగడివీథిని దాసి విక్రయింపఁ బడుచున్నదా?

వటు—గురువుగారితో నే నసత్యము మనవిచేయుదునా?

ఉపా—అట్లయిన నక్కడకే పోవుదము.

వటు—చిత్తము. గురువరా! ఇటువిచ్చేయుఁ డిటువిచ్చేయుఁడు.

ఉపా—(నడచి చూచి యాశ్చర్యముతో) ఓహో! యంగడివీథి యెంతరమణీయముగా నున్నది!

మ. పసిఁడిన్ మేరువసుంధరన్, మణులచేఁ బాథోధివేలన్, నవాబ్దసమానోన్మదసామజచ్ఛటల వింధ్యశ్రీ విడంబించుచున్,
వసనోత్పల్లవ యాచుఁ గల్పలతలేవన్ బార్థితార్థంబు ల
ర్థిసమూహంబున కిచ్చునివ్విపణి బుద్ధిన్ లోలముల్ జేయదే. ౧౫

వటు—స్వామీ! గురువర్య! అదిగో నక్కడ గుంపుగా సెందఱోజనులు గనఁబడుచు

